# నవల గురించి

ప్రపంచ అపరాధ పరిశోధన సాహిత్యంలో అందరికన్నా ముందు వినిపించే పేరు ఆగదా క్రిస్టీ. ఆమె పుస్తకాలు ఇప్పటికి ఎన్ని పుస్తకాలు అచ్చయినయి? అన్న ప్రశ్నకు జవాబు చెప్పడం కష్టం అంటున్నారు. ఈ ప్రపంచంలో అన్నిటికన్నా ఎక్కువ ప్రతులు అచ్చయిన పుస్తకం బైబిల్. ఆ తరువాత స్థానం షేక్స్పియర్ నాటకాలది. ఇక ఆగదా రాసిన నవలలు, కథాసంకలనాలను అన్నింటినీ కలిపితే మూడవ స్థానం ఆమెదే అంటున్నారు. ఆ విజయం వెనుకనున్న రహస్యాన్ని ఆగదా స్వయంగా చెప్పారు. 'నేనేమీ మహత్తరమయిన సాహిత్యం సృష్టించలేదు. కేవలం సరదాగా సరదా కొరకు రాశాను' అన్నారు ఆమె. ఇంకేం, మీరు కూడా సరదాగా ఈ పుస్తకాన్ని చదివి ఆనందించండి?

ఆగదా క్రిస్టీ తన రచనలలో హెర్క్యూల్ పోయ్‌రో, మిస్ మార్ఫ్ల్ అనే పెద్ద వయస్సు వ్యక్తులను డిటెక్టివ్‌లుగా వాడుకున్నారు. హెర్క్యూల్ పోయ్‌రో అన్ని రకాలుగాను విచిత్రమయిన వ్యక్తి. కేవలం ఆలోచన సాయంతో కేసులను విడదీస్తాను, అంటాడు. అతను బెల్జియంలో పోలీస్ ఆఫీసర్‌గా పనిచేసి పదవీవిరమణ చేశాడు. అలవాటుగా ఫ్రెంచ్ మాట్లాడతాడు. ఉండేది మాత్రం లండన్ నగరంలో. అతను పొట్టి, లావుపాటి మనిషి. టి.వి. ఎపిసోడ్స్‌లో డేవిడ్ సుషే అనే నటుడు ఈ పాత్రకు ప్రాణం పోశాడు.

ఇక ఈ నవలలో...

ఒక లార్డ్ హత్యకు గురవుతాడు. భార్య అతడిని చంపిందని అందరూ అనుకుంటారు. కానీ, ఆ సమయానికి ఆమె ఒక పార్టీలో ఉందని చాలామంది సాక్ష్యం చెపుతారు. పోయ్‌రో పరిశోధనల క్రమంలో ఇదొక చిత్రమయిన కేసు. ఇందులో తన ప్రమేయం లేదంటాడు అతను. దారిన పోయే ఎవరో అన్నమాట సాయంగా కేసు విడిపోయింది, అంటాడు. నిజంగానా! చదివితే మీకే తెలుస్తుంది. ఆద్యంతం సస్పెన్స్‌తో సాగే నవల మీ చేతిలో ఉంది.

ఇక మీ ఇష్టం!

**– గోపాలం కె.బి.**



# 1

# పార్టీ

ప్రజల జ్ఞాపకశక్తి అంత గట్టిది కాదు. జార్జ్ ఆల్‌ఫ్రెడ్ సెయింట్ విన్సెంట్ మార్ష్ లేదా నాల్గవ ఎడ్జ్‌వేర్ బారన్ హత్య గురించి, అది రేకెత్తించిన ఆసక్తి, ఆర్భాటాలను గురించి అందరూ అంతలోనే మరిచిపోయారు. ఆ తరువాత మరేవో సంచనాలు జరిగాయి.

నా మిత్రుడు హెర్క్యూల్ పోయ్‌రో పేరు ఆ కేసు విషయంగా బాహాటంగా బయటకు రానేలేదు. నన్ను చెప్పనిస్తే అది అతని కోరిక ప్రకారమే జరిగింది మరి. అందులో తన ప్రమేయం కనిపించకూడదన్నాడు. కేసును విడదీసిన గుర్తింపు మరెవరికో పోయింది. అతను కూడా అలాగే జరగాలన్నాడు. పైగా, పోయ్‌రో విచిత్రమయిన సొంత ఆలోచనాధోరణి ప్రకారం ఆ విషయంలో అతను అపజయం పాలయ్యాడు. బజారులో పోతున్న గుర్తు తెలియని మనిషి అనుకోకుండా అన్న మాట మీద కేసు సరయిన మార్గాన పడిందని అతను ఎప్పుడూ చెబుతూంటాడు.

ఏమయితేనేమి నిజానికి కేసును విడదీసింది అంతులేని అతని తెలివి మాత్రమే. హెర్క్యూల్ పోయ్‌రో లేకుంటే హత్య చేసినవారి సంగతి అసలు బయటపడేదే కాదని నేనంటాను.

కనుకనే ఆ వివరాలన్నింటినీ నాలుగు అక్షరాలలో బంధించి పెట్టవలసిన సమయం వచ్చిందని నాకు అనిపిస్తున్నది. నాకు ఆ కేసులోని ఆనుపానులన్నీ వివరంగా తెలుసు. వాటన్నింటినీ రాసిపెట్టినందుకు ఒక మహిళ కోరిక కూడా

తీరుతుందని  చెప్పక తప్పదు.

పోయ్‌రో ఇంట్లోని సిటింగ్ రూమ్‌లో అతను ఆ చిన్న కార్పెట్ మీద అటూ ఇటూ తిరుగుతూ ఉండడం నాకు ఎన్నో సార్లు గుర్తుకు వచ్చింది. అలా తిరుగుతూ, ఆ పొట్టి మానవుడు కేసు గురించిన వివరాలను సాధికారంగా, ఆశ్చర్యకరంగా చెప్పాడు మరి. అతను చెప్పిన క్రమంలోనే నా రచనను కూడా నడిపిస్తాను. కనుక కథ గత సంవత్సరం జూన్ మాసంలో లండన్‌లోని ఒక థియేటర్‌లో మొదలవుతుంది.

ఆ రోజుల్లో లండన్ నగరంలో కార్లొటా ఆడమ్స్ అనే పేరు సంచలనం రేపుతున్నది. అంతకు ముందు సంవత్సరం ఆమె పగటిపూట చేసిన రెండు ప్రదర్శనలు విపరీతంగా విజయం సాధించాయి. ఇక ఈ సంవత్సరం ఆమె వరుసపెట్టి మూడు వారాలపాటు సీజన్‌గా ప్రదర్శనలు ఇచ్చింది. నిన్నటిరోజు ఆ వరుసలో చివరి రోజుకన్నా ముందు రోజు.

కార్లొటా ఆడమ్స్ ఒక అమెరికా అమ్మాయి. ఆమె అడ్డు లేకుండా ఏక పాత్రాభినయాలను ఆశ్చర్యకరంగా చేస్తుంది. అందుకు మేకప్, సీనరీల వంటివి అడ్డు రావు. ఆమె అన్ని భాషలను అంత సులువుగానూ మాట్లాడగలుగుతుంది, అనిపిస్తుంది.  ఒక సాయంత్రం ఒక విదేశీ హొటల్‌లో సంఘటనను ఆమె వర్ణించిన తీరు నిజంగా ఆశ్చర్యకరం. ఇక అమెరికన్ టూరిస్టులు, జర్మనీవారు మధ్యతరగతి ఇంగ్లీషు కుటుంబాలవారూ, ఆకతాయి ఆడవాళ్లూ, బీదలయిన రష్యన్ రాజకుటుంబాల వారూ, అలా ఎంతో మందిని గురించి ఆమె క్షణంలో మారుస్తూ ప్రదర్శన నడిపిస్తుంది. వాటిలో కొన్ని భయంకరంగా ఉంటే మరికొన్ని పిచ్చి సరదాగా ఉంటాయి. చూస్తుండగానే మళ్లీ పద్ధతి మారుతుంది.

ఆస్పత్రిలో ఉన్న ఒక చెకొస్లొవాకియన్ మహిళ పాత్రను ప్రదర్శిస్తూ ఉంటే ఎంతటి వారికయినా గొంతు పూడుకుపోతుంది. ఆ మరుక్షణం పళ్లు పీకుతున్న ఒక వైద్యుడి ప్రదర్శన మొదలయితే, అతడి మాటలు, చేతలకు గురవుతున్న మనిషి పరిస్థితికి అందరూ పొట్టలు పట్టుకుని నవ్వుతారు.

ఆమె ప్రదర్శన 'సమ్ లిమిటేషన్స్' అనే అంశంతో ముగిసింది.

అక్కడ కూడా ఆమె ఆశ్చర్యంగా తెలివిని ప్రదర్శించింది. మేకప్ అవసరం

లేకుండానే ఆమె ఒక ప్రసిద్ధ నాయకుడుగా లేదా పేరున్న నటిగా లేదా మరో అందగత్తెగా మారిపోయిన భావం కలుగుతుంది. ఆయా పాత్రలలో ఆమె ఒక చిన్న ఉపన్యాసం లాంటిది చేస్తుంది. ఆ మాటలు చాలా తెలివిగా ఉంటాయి. ఆయా పాత్రల తీరును కళ్లకు కట్టి చూపిస్తాయి.

ఆమె అనుకరించిన వ్యక్తులలో జేన్ విల్కిన్‌సన్ ఒకర్తె. ఆమె కూడా లండన్‌లో పేరున్న అమెరికన్ అభినేత్రి. ఆ పాత్రను నటిస్తున్న ఆమె నాలుక నుంచి తప్పుడు మాటలు దొర్లాయి. అయితే వాటిలో గొప్ప భావాలు విని పించాయి. ప్రతీ మాట వెనుకాల ఏదో లోతయిన అర్థం ఉందని ఎవరికి వారే అనుకునే పరిస్థితి అది. ఆమె గొంతు ఒక విచిత్రమయిన లోతయిన బొంగురు పద్ధతికి మారింది. అది మత్తెక్కించేదిగా ఉంది. చేతుల కదలికలు ఎక్కువగా లేవు. చేసిన ఒకటి రెండు కదలికలు చాలా బాగున్నాయి. శరీరం మాత్రం కదు లుతున్నది. అందులో గొప్ప అందం తోస్తున్నది. ఆమె ఎంత బాగా నటించింది. నేను చెప్పలేను!

అందాలరాశి జేన్ విల్కిన్‌సన్‌కు నేను సదా అభిమానిని. ఆమె భావ ప్రదర్శనతో నన్ను అదరగొట్టింది. అందరూ ఆమె అందం గురించి మాట్లాడతారు. గొప్ప నటి కాదు అంటారు. కానీ ఆమెలోనూ హిస్ట్రియానిక్స్ బలంగా ఉన్నాయి.

ఆ చిత్రమయిన గొంతును వింటూ ఉంటే, నాలో ఏదో గొప్ప కదలిక మొదలవుతుంది. ఆమె కదలికలను చూస్తూంటే ఆ చేతులను ముఖ్యంగా చూస్తూ ఉంటే, ఆ తల విదిలింపులను చూస్తూ ఉంటే, ఆ వెంట్రుకల విసురును చూస్తూ ఉంటే, అందులోని నాటకీయత చాలా బలంగా ఉంటుంది.

పెళ్లి తరువాత రంగస్థలాన్ని వదిలేసి రెండు సంవత్సరాలకు మళ్లీ తిరిగి వచ్చిన నటీమణులలో జేన్ విల్కిన్‌సన్ ఒకరు.

మూడు సంవత్సరాల క్రితం ఆమె ధనవంతుడయిన లార్డ్ ఎడ్జ్‌వేర్‌ను పెళ్లి చేసుకున్నది. అయితే అతను కొంత తిక్క మనిషి. కనుకనే ఆమె అతడిని వెంటనే వదిలేసిందని పుకార్లు పుట్టాయి. ఏమయినా, పెళ్లికి ఏణ్ణర్థం తరువాత ఆమె అమెరికాలో మళ్లీ సినిమాల్లో నటించ సాగింది. ఈ సీజన్‌లో లండన్‌లోని ఒక గొప్ప నాటకంలో కూడా కనిపించింది.

కార్లొటా ఆడమ్స్ చేసిన అనుకరణలలో కొంత కుతంత్రం ఉందని పించినప్పటికీ, ఆ అనుకరణల తీరు గురించి బలంగా ఆలోచించవలసిన అవసరం నాకు కలిగింది. వాటివల్ల కలిగిన ప్రచారంతో లేదా చెడ్డపేరుతో వాళ్లకు ఆనందం కలుగుతుందా? తమ వ్యాపారంలోనే అటువంటి ఆపదలు ఉన్నాయి కనుక వాళ్లకు ఏమయినా చికాకు కలుగుతుందా? కార్లొటా ఆడమ్స్ ఆ అనుకరణ చేసినప్పుడు ఒక మెజీషియన్‌లా కనిపించింది. మరొక మెజీషియన్ వచ్చి 'ఓస్! ఇదొక పాత ట్రిక్కు. చాలా సులభం. ఎలా చేస్తారో నేను చూపగలను!' అంటారేమో అనిపించింది.

ఆమె గనుక నన్ను అనుకరించి ఉంటే, నాకు బాగా కోపం వచ్చేదని నిర్ణ యించుకున్నాను. అయినా, నా భావాలను నేను కప్పి ఉంచుకోవాలి. అంత మాత్రాన అంగీకరించినట్టు కాదు. అలా చేయడానికి చాలా పెద్ద మనసు కావాలి. మనలను ఇంత అన్యాయంగా అందరి ముందూ విప్పి చూపిస్తే హాయిగా నవ్వడానికి అంతకన్నా మరేదో కావాలి.

ఈ భావాలు నా మనసులో మెదలాడుతుండగా అనుకరింపబడుతున్న ఆ గొంతుక నా వెనుక వినిపించింది.

చటుక్కున తలతిప్పి చూచాను. వెనకనున్న సీట్లో ఆమె ముందుకు వంగి కూచుని ఉంది. పెదవులు కొంచెం విప్పుకుని ఉన్నాయి. ఆమె ఎవరో కాదు ఇంతకు ముందు అనుకరణకు గురయిన లేడీ ఎడ్జ్‌వేర్! ఆమెను జేన్ విల్కిన్‌సన్ అంటే మరింత సులభంగా తెలుస్తుంది.

నా ఆలోచనలు అన్నీ తప్పులని నాకు అర్థమయింది. ఆమె ముందుకు వంగి ఆనందంగా చూస్తున్న తీరులో ఆమె కళ్లలోని ఉత్సాహంలో నా భావాలు కనిపించలేదు.

అనుకరణ ముగిసింది. ఆమె కూడా చప్పట్లు చరిచింది. నవ్వుతూ తన పక్కన కూచున్న అందగాని వేపు చూచింది. అతనొక గ్రీకు దేవతలా ఉన్నాడు. అతను రంగస్థలం మీదకన్నా సినిమా తెరమీద బాగా పేరుపొందిన వ్యక్తి అని నేను గుర్తించ గలిగాను. బ్రయన్ మార్టిన్ ఆ రోజుల్లో సినిమారంగంలో చాలా పేరుపొందిన మనిషి. చాలా చిత్రాలలో అతను జేన్ విల్కిన్‌సన్‌తోపాటు కలిసి